ఆత్మనివేదన

ఓం గం గణపతయే నమః

ఉ|| శ్రీగిరిపైన చెంచులకు చిక్కితివీవు సదావినీతులౌ
శ్రీగిరి చెంచులెంతగను చింతన చేసితిరోకదా! నినున్
శ్రీగిరిపైనవసించుటకు చింతనజేయవె తండ్రి! నీదరిన్
శ్రీగిరిచెంచువోలెనిక చింతనచేయుదు మల్లికార్జునా|| 1

ఉ|| నీవును నేనునిశ్చలమతి నిచ్చలునుండగకోరుదెప్పుడున్
ఆవునుదూడయున్నలిసి ఆడుచుపాడుచునుండునట్లుగా
సేవలుపొందుమయ్యనను చెల్మిన చేరగదీసిహాయిగూర్చుచున్
కేవలమీవునేన్గలసి యెప్పుడుయుందము మల్లికార్జునా|| 2

ఉ|| శ్రీపతిచేతసేవగొను చిన్మయరూపమ దివ్యలింగమా
నీపదమున్మనంబునను నిల్పి సదామననంబుజేసెదన్
ఏపదమందునిల్పెదవొ ఏమనిదల్తువొ నీమనంబునన్
కాపలయుండిరక్షనిడు కామితదాయిక మల్లికార్జునా|| 3

మ|| అతిసూక్ష్మంబగుశబ్ధమైన సరిగాపాణింధమంబైచనున్
అతిసూక్ష్మంబగుజీవియైన సరిగాబ్రహ్మాంశ సంభూతమౌ
మితిలేదంతటమీదుకార్యముల స్వామిత్వమ్ముచెల్లున్సదా
మతినూహింపగచిక్కదేమినతిసామాన్యుణ్ణి మల్లేశ్వరా || 4

ఉ|| ఇంచుకచూడుమయ్యమనమించుకనాపయియుంచుమయ్య నా
సంచితకర్మలన్నిటిని సాంతముభస్మము సేయుమయ్య నీ
పంచనయుండనిచ్చి తనుభావన మాయము జేయుమయ్య యే
వంచనలేక జీవితము వర్ధిల సిద్ధుని జేయుమయ్య యీ
పంచమలాలు బాపి పశుపాలక పర్వతమల్లికార్జునా|| 5

పంచమలాలు

1. ఆణవమలము=పరబ్రహ్మనుగూర్చి అపుడపుడు గలిగెడు జ్ఞానమును మఱుగుపఱచునది.

2.కార్మికమలము=గురువుబోధించిన పరమార్ధమందు బుద్ధిచొరనీయనిది.
3.మాయకమలము=పరతత్వజ్ఞానవాసన చప్పుడునుగలుగనీయనిది.
4.మాయేయమలము=పాపకార్యములందుమాత్రమే బుద్ధినిజొన్పునది.
5.తిరోధానమలము=పరబ్రహ్మమనిత్యమనుబుద్ధినిగల్గించి జనన మరణాది దు:ఖములను గలుగజేయునది.

ఉ|| సత్యపదార్ధయానము సాధనశక్తిని యిమ్మనంటి యే
వ్యత్యయమొద్దనంటి యికవ్యాధినివారణ సేయమంటి ఆ
మృత్యువుచేరువేళ మరి ఋత్విజురక్షణ యిమ్మనంటి నా
ప్రత్యయ శక్తి నీవె శివ! భక్తుని చూడుము మల్లికార్జునా|| 6

<u>ఋత్విజుఁడు</u>= సం.వి.జ్.పుం.యజ్ఞకర్తచేత ధనము పుచ్చుకొని యజ్ఞము చేయించువాడు.ఒజ్జ. వీరు పదహారుగురు
1.బ్రహ్మ.2ఉద్గాత.3.హోత.4.అధ్వర్యుడు.5.బ్రాహ్మణాంచ్ఛంసి 6.ప్రస్తోత.7.మైత్రావరుణుఁడు. 8.ప్రతిప్రస్థాత.
9.పోత.10.ప్రతిహర్త.11.అచ్ఛావాకుఁడు.12.నేష్ట.13.అగ్నీధ్రుఁడు14.సుబ్రమణ్యుఁడు.15.గ్రావస్తుఁడు.16.ఉన్నేత.
<u>ప్రత్యయము</u>= సం.వి.అ.పుం.1.సుప్తిజ్ఞాది.2.విశ్వాసము.3.ప్రసిద్ధి.4.జ్ఞానము.5.ఆచారము.6.శపథము 7.అవకాశము.
8.వశము.9.హేతువు.

ఉ|| తప్పులుదిద్దమంటి సరితావులు చక్కగ చూపమంటి యే
తిప్పలు పెట్టకుండ పదిదిక్కుల రక్షణయిమ్మనంటి నా
గొప్పలు యేమిలేవు నినుగొల్చుటకంటెను వృత్తిలేదు నీ
మెప్పులు నాకుగల్గ వరమియ్యవె పర్వతమల్లికర్జునా|| 7

ఉ|| సంతతతైలధారవలె సఖ్యతజూపుచు నీకృపాంబువుల్
సాంతమునన్ను తన్పగరసాంబుధిమున్కలు వేయుచున్
స్వాంతమునందు నీదుపదసన్నిధి వీడకయుండునట్లు యే
కాంతమునిచ్చు రక్షనిడి కావుము పర్వతమల్లికార్జునా || 8

ఉ|| నేనుశిరస్సువాల్చి మదినెప్పుడు గొల్చెద నీదుపాదముల్
మేనునువంచియుంచిమనమేమియుతల్వకనిన్నెగొల్చెదన్
కానవుయేల?తండ్రి యిదిగాయముజేసెను గుండెనందునన్
నేనుభరించలేను యిదినిక్కము పర్వతమల్లికార్జునా || 9

ఉ|| తర్కము యేలనయ్య!యికతన్పుము నీదుదయారసంబుచే,
మర్కటబుద్ధిమాన్పి యిటమానుషజన్మము ధన్యతనొంద యీ
కర్కశమానవాధముల కామ్యపు యోచనలన్ని గాల్చి, యో
యర్క సమాననేత్ర నను గావుము పర్వత మల్లికార్జునా || 10

ఉ|| కానవుయేమిదేవ!యిటకాయముగాయముపాలుయవ్వగన్
మాననిబాధతో వికల మానస వేదన చుట్టుముట్టినన్
నేనను భావజాలమది నిత్యము వృద్ధిని పొందుచుండె నీ
యానతియైనమోక్షమగు! అక్షయలింగమ మల్లికార్జునా|| 11

ఉ|| సత్యమునీవెయంటి ఫలసాయము సొంతమునీవెయంటి ఆ
తత్వము నీవెయంటి పరతాత్విక భావము నీవెయంటి దా
తృత్వము నీదెయంటి జనతృష్ణను దీర్చుట నీదెయంటి యో
తత్వ విచార ధీర! వరదాయక! పర్వత మల్లికార్జునా || 12

శా|| దేవానీ కరుణా కటాక్ష ఫలనిర్ధేశంబు నన్గాదె నే
సేవాభావముతోడయుంటినిట నాక్షేమంబునీభారమౌ
నీవే వృత్తినిబంపినావొకానంగ నేజ్ఞాన హీనుండ గా
దే! విశ్వాసిని బాధపెట్ట తగునా? దేవేశ!మల్లేశ్వరా|| 13

ఉ|| ఆనలువే సదా తవపదాంబుజ సేవలు చేయుచుండగా
కానల లోన నొచ్చిచట కాపురముండితివేలనయ్య నీ
యానతియైనచాలు యిలయంతవసంతమువ్యాప్తిచెందిడిన్
మానవునుద్ధరించుమిక మాయనుజీల్చుచు మల్లికార్జునా || 14

ఉ|| నీచులసేవజేయ పలునిందలు పొందుటయేఫలంబగున్
సైచితినెన్నొకష్టముల స్వాంతమునందునశాంతిలేదిటన్
కాచినచెట్టునేనరులు కాయలకోసము రాల ఁగొడ్డురే
వేచితి నీదుయాజ్ఞకిట యేమనిదల్తువొ? మల్లికార్జునా|| 15

ఉ|| పూర్వులునీదువర్ణనలు పోలికలన్నిటినెంతొచిత్రతన్
పర్వగ జేసిరీ జగతి పాప విముక్తికి నీవెకర్త వై
సర్వమునిర్వహింతువని!సామ్యముయెవ్వరులేరునీకనిన్!
సర్వధురీణకారి!నిను సౌమ్యసురూపము చూపవేడెదన్|| 16

చ|| రణరహితంపు స్నేహమధురంపుసుధాంశఫలంపుజీవమున్

వ్రణరహితంపుదేహమునవర్ధిలునాత్మవికాస భావమున్
ఋణరహితంపుజీవితమువృద్ధినిపొందుపథంబు సప్రభా
గుణసహితంపుబుద్ధియునుకోరితిపర్వతమల్లికార్జునా || 17

చ|| నిధులనుమాటపల్కుచు కనీసవిచారణలేకయాశతో
కథలవియెన్నొజెప్పుచు కకావికలౌపథమందుపోవుచున్
మదమునకన్నుగానకయమానుషులయ్యుమదేమితల్వకన్
వ్యథలనుపొందుచుందురు యవారణరోగులు,మల్లికార్జునా॥18

ఉ|| పూర్వపు జన్మ కర్మఫల పుణ్య విశేషము చేతనేకదా
యుర్వినయున్ననాళ్ళుసుఖమొందుచునుండునుజీవజాలమున్
పూర్వపు జన్మ కర్మఫల పుణ్య విహీనత చేతబాధలున్
సర్వమునొంద జేతువిల సాంతము పర్వతమల్లికార్జునా|| 19

మ|| గుహలోచీకటిపారదోలినయవాగ్యోపాయమార్గంబునన్
యిహలోకంబుననున్ననాళ్ళువిమలాదేశంబునిచ్చెప్పు యే
కుహనాబుద్ధులపీడలేకభువిలోకూర్మిన్సుయోగంబునీ
బహుమానంబుగమాకుయిమ్ముయిక! ఓపాలాక్షమల్లేశ్వరా|| 20

ఉ|| జ్ఞాపకమేమిలేదుశివనాకునునీకునుపంతమేమిటో
కాపరినీవెగా! పశుల కామనతీర్చుట నీదుధర్మమౌ
నాపయికోపమేలనయ?నామదికొల్తునునిన్నుయెప్పుడున్
నీపదమేను తల్చెదను నిత్యము పర్వతమల్లికార్జునా || 21

ఉ|| వేద పురాణశాస్త్రములు వేయివిధాలుగ నిన్నుదెల్పు నా
ఖేదముమాన్పవయ్య ననుఖిన్నునిజేయక ముందునిల్చి నీ
పాదము ముట్టనిచ్చి పశుభావన నాశముచేయుమయ్య యీ
పేదకి ముక్తినిచ్చి దరిజేర్చుము పర్వతమల్లికార్జునా || 22

ఉ|| నేనిటయున్ననాళ్ళునినునిత్యము దల్తును పూజచేయుదున్
నేనట నడ్డుపెట్టగను యేమగునోకద! మర్చిపోవుదున్

నేసినుచూచినప్పుడట నిక్కములింగమునందునిల్చెదన్
మేనునుమర్చిపోవుదునుమేధినిమర్తును మల్లికార్జునా || 23

ఉ|| పూర్వపు గాధలెన్నిటినొ భూరిగ వింటినిదేవదేవ ఓ
సర్వ పదార్ధమూలగుణ సామి! నినేమని పిల్చువాడ! నే
గర్వితమానినైతి నిను కానకయుంటిని తెల్సితిప్డు! ఓ
శర్వ!దయారసాంబువుల జల్లుచె తన్వుము మల్లికార్జునా|| 24

ఉ|| సాయముసేయమంటి మనసానినుచూపమనంటి భక్తులున్
కాయమువిడ్వదర్శనమగంటిరి! చింతిలుచుండనంతలో
ఓయమ పిల్చినీదుపదపూజను జూపెను హాయిగూర్పగా
వాయువుమోసుకొచ్చెను సువాసనలెన్నియొ మల్లికార్జునా॥ 25

ఉ|| సేవ్యుడవీవు సేవకునిసేమమముకోరుటధర్మమౌనుగా
దివ్యులకీవుదర్శనముతీర్పుగనిచ్చెదవేమి? భక్తులే
భావ్యులుగార? తండ్రి నినుబాగుగచూడగనిచ్చగింతురే
అవ్యయరూప! నీవెరుగుదన్నియు పర్వతమల్లికార్జునా|| 26

ఉ|| కన్నులుమూసియుంచినినుకాంచగకాంక్షతొ దీక్షబూని యే
సన్ననిశబ్ధమౌనొయని సొంతముకర్ణముమూసుకొంటి యే
మన్నను మాటలాడకను మౌనముపట్టుగబూనియుండితిన్
యిన్నియుజేసినన్ మనసునిల్చుటలేదయ మల్లికార్జునా|| 27

ఉ|| పూర్వపు పుణ్యకర్మలచె పొందుగ దర్శనమొందినాడ నే
సర్వమునీకుముట్టగను సొంతమువిడ్చితిపాదసేవకై
సర్వసురాదులిచ్చుటనె సాగిలపడ్చును యడ్డముండగా
ఖర్వుడనైతినేడిటను కామితసేవకు మల్లికార్జునా || 28

ఉ|| అక్షరపల్లకీసుమధురాంచితభావపుమల్లెతోటలో
యక్షరదీక్షబూనిమృదులాంచితకేతనమూనిభావనా

యక్షరతాసురక్ష శశిలాంచితనోమునిసేవజేసి మా
రక్షణుమాధవుండని సరాజవిరాజితలాంఛనాఖ్యులౌ
యక్షరదేవిదేవులని అర్చన సేసదమల్లికార్జునా|| 29

ఉ|| తాండవమందునీదు పదతాడన లాస్యవిలాస వేళలో
యండజయానవాహనునియంగజుతండ్రులసంస్తవంబుతో
కొండలరేనికూతు సుమకోమలచూపుల తూపువాడిలో
యుండగకొక్కెమూడిపదమూడితికానవె!మల్లికార్జునా|| 30

12-9-2010 ఆదివారము ఉదయం గం.5.10నిలకు మొదలుపెట్టాను

ఉ॥ ఓమ్మనుమంత్రరూపమునయొద్దికనొందుదువన్నుతల్తు రా
నమ్మకముండినిన్కనగనాదగుమార్గమునందుగాంచగా
నమ్మనుగూడి నిల్చితివి నామదినవ్యయ రూపమైసదా
నమ్మరదేమి యీజనము నజ్ఞతచేతను మల్లికార్జునా ॥ 31

ఉ॥ నందనునొందనిన్కొలుచునమ్మికతోడుతభక్తులందరా
నందముకల్గచేతువల నార్తిని బాపగ వంశవృద్ధితో
యందమనంగనీదెగిరినందనసేవలుపొందుదెప్డు యో
సుందరభావపోషణతౌసౌఖ్యమునిత్తువు మల్లికార్జునా ॥ 32

ఉ॥ మోక్షమునీయనీవెసరిమోహమునాశముచేతువెప్డు నా
పక్షమునుండిశిక్షణలుబాగుగనీయుమునందివాహనా
రక్షణయిచ్చిబాలురనురమ్య సుధీమతులట్లు సేయవే
కక్షలుకల్గకుండగను కావవె పర్వత మల్లికార్జునా ॥ 33

ఉ|| భక్తవశంకరుండవనిబాగుగవింటినినేటిదాక నే
రిక్తుడనైతినయ్య పలురీతులపూజలుచేయెజాల యే

యుక్తినినిన్నుకొల్వవలెయోచన చేయగలేనుతండ్రి!యా
సక్తినివీడలేను ననుశక్తునిజేయుము మల్లికార్జునా ॥ 34

ఉ|| గర్వముచెందనేలయిల కాయమునందునయున్ననాళ్ళయా
పూర్వపుపాపపుణ్యములుపూర్తిగహొందెదనాదుకర్మలన్
సర్వముశూన్యమవ్వగను చక్కగచేతువనెంచితల్చెదన్
మర్వకనన్నునీదుపథమందుననిల్పుము మల్లికార్జునా|| 35

ఉ|| వంశమువృద్ధిచేయుమయ!వారసునివ్వగసత్కళత్రమున్
సంశయమేమిలేకయిక సంసృతిదాటమదీయపుత్రుడున్
అంశమునీదియుండవలెనన్నిటనర్హతనొందనెప్పుడున్
పాంశులమేమియంటకను పాపవిముక్తిని మల్లికార్జునా|| 36

ఉ॥ తేమదికల్గునట్లునొకతీరుగలింగముపైననీటితో
తేమగయుంత్రులింగమునుతెల్సినదేమనలింగపీఠమా
కామునిపట్టుగాననదికాంచగతేమసుభత్వమౌసదా
నామదినిన్నునట్లెకనినాడనుపర్వత మల్లికార్జునా ॥ 37
ఈభావన లింగరూపమును పూర్తిగా అర్థనారీశ్వరరూపమునెంచుటచేకల్గినది
ఇది ఆలోచించిచూచువారలకు సులభంగానె అర్థమవుతుందని తలుస్తాను.

ఉ॥ రుండములన్నిమాలలనురూపునదాల్తువుయేలనయ్యచా
ముండమనోధినాధననుమోక్షపుమార్గమునందునడ్పవే
యండజయాను గర్వమదినణ్చ తలన్దునిమాకపాలహ
స్తుండవయెప్డు భిక్షడిగి శుద్ధులజేసితె మల్లికార్జునా॥ 38

ఉ॥ ద్రావకుడీవుతన్నుదువుత్రాతగజీవులకన్నరూపి వై
పావకలోచనా! పశులపాలకుడీవు కపాలపాణి నా
భావమునందునిల్పి పశుభావననాశముచేయుమయ్యవో
భావజవైరి భక్తులకు భాగ్యపుపంటవె మల్లికార్జునా॥ 39

ఉ॥ యంత నియంత తంత్రగత యత్నపుటర్థపదార్థపాలకా
కంతవసంతతంతులవికన్పడజంకునునిన్ను జూడగా
మంతనమేమిలేదుమతిమంతుడవీవు పరేతనాథ నీ
పంతముమాపయేలనయ పార్వతివల్లభ మల్లికార్జునా ॥ 40

యంత=సం.వి.ఋ.పుం.1.తేరుగడుపువాడు 2.మావటివాడు

ఉ॥ నమ్మకముంచినిన్నుకన నాడును నేడునునిన్నెగొల్చితే
రమ్మనిపిల్వలేదుకద రమ్యసుధామయమౌసభాస్థలిన్
కిమ్మనకుంటినయ్య పరికించినకాన్పడునాదునున్కియున్
యిమ్మహియున్నకాలమునయిమ్మికభక్తిని మల్లికార్జునా ॥ 41

ఉ॥ మర్మముతెల్యనయ్యమరిమంతనచేయగలేనుదేవనా
కర్మలు నీదుసేవలయికాంతులుచిమ్మగచూడుమయ్యనే
ధర్మముతప్పకుండగనుతన్మయచిత్తమునిమ్ముదేవరా
కర్మల ధర్మమర్మములకాదరువీవెగ మల్లికార్జునా ॥ 42

ఉ॥ హర్షమునీదురూపుదరహ-సముహ-యినిగూర్చు నాహృది నా
కర్షితమయ్యెసదామతికామనివారణకార్యమందు నా
శీర్షమువంచిమొక్కెదనుచిద్ఘనలింగమచిత్తమందునన్
హర్షవిలాసనాట్యరసహర్షక పర్వతమల్లికార్జునా ॥ 43

ఉ॥ శంకర శక్తిదాయక శశాంకధరా శరణీయ శాస్త్రధీ
కింకరరక్షణాస్ఫురణ గీష్పతి సేవిత పాదపద్మ నే
యంకితభావనాస్ఫురితయర్చనసేసెదయక్షరాణ్ణఖా
శంకిత బుద్ధిమాయమవశాసనమీయుము మల్లికార్జునా ॥ 44

ఉ॥ భక్తులపాలికల్పతరుపాటివిబంధువునైతివే సదా

సక్తులశక్తియుక్తులనుశాసన జేతువుశంకితాత్ములన్
రిక్తుల జేతువో జగతి రీతులవన్నియు నీదుయాజ్ఞలొ
భక్తవశంకరా! పశుల పాపవినాశన మల్లికార్జునా ॥ 45

ఉ॥ వేదములన్నినిన్నుకనవేలవిధాలగమించి జూచెనే
సాదనలెన్నియున్ననవిసాదముకోసమెయన్నయట్లుయా
సాదుసురేంద్రులంతతమ సాటికి రారభయంకరా శివా
నాదునిజార్థమీవయనినమ్ముకొనుంటిని మల్లికార్జునా ॥ 46

ఉ॥ చర్చలుయెన్నిచేసినను చిక్కగలేదుర నీదుతత్త్వమున్
యర్చనజేయువారలిటనందరినడ్గితి తేలదేమియున్
పర్చితమున్నవారెవరొ? పాప విమర్థన తెల్యజేసి పో
కార్చుమునాదుసందియము కామితదాయక మల్లికార్జునా॥ 47

ఉ॥ మన్మనమందునీజపము మానను మన్మథవైరిసర్వదా
జన్మనుయెత్తవద్దుమరుజన్మనబాధలుపొందవద్దయా
జన్మలుకల్గకుండగనుచక్కనిస్థానమునిచ్చికావవే
సన్మతిసన్నిధిమ్ముభవసాగరమీదగ మల్లికార్జునా ॥ 48

ఉ॥ యోచనసేయగాసకలయోగములన్నియునీదుయాజ్ఞలే
లోచనగోచరమ్మునగులోకమునంతయునీదుకల్పనే
వాచకమంత నీకృపతొ వర్ధిలునంతట వైరినాశనా
వాృచనలేరు నీమహిమ వత్సలదేవర మల్లికార్జునా॥ 49

ఉ॥ భక్తులచిత్తమున్నిలచి భద్రతనిత్తువు భాగ్యమిత్తువో
యుక్తినికల్గజేసతని యోగ్యతతెల్పుదు యోగదాయకా
వక్తనుసేతుమూగనల వాక్కునుయిచ్చుచు వాగధీశ్వరా

శక్తియుతుణ్ణిజేసిపలుశంకలుతీర్తువె మల్లికార్జునా ॥ 50

ఉ॥ వేలుపులంతనీదుపద వెల్గులయందునయోగ్యశక్తులొ
కాలునినిగ్రహించిపలు కాడకజేతువుకాలకాల పా
పాలనుకడ్గివేసిపర పాలననంతముజేతువెప్పుడు
న్మ్కాలగజేసిదుర్మతుల కూర్తుశుభంబుల౯ మల్లికార్జునా॥ 51

ఉ॥ చక్కనియూహబుట్టెమది చంద్రకళాధరనిన్నుతల్వగ
నిక్కముపల్కుచుంటినయ నిచ్చలునీకడనుండనెంచితి
న్చిక్కదుమార్గమేమియును నిశ్చలితాత్మకనిర్గుణేశ్వరా
దిక్కునుచూపిదారికన దీవిటివైనిలు మల్లికార్జునా ॥ 52

ఉ॥ నందదివాహనమ్మవగనందికికోర్కెనుదీర్చితీవు యా
నందమునిచ్చినావుమరి నామతితెల్సియునూరకొంటి వే
లందరి కోర్కెదీరుట విలంబన మేలగు నందివాహనా
డెందమునందుసందియముడించుముపర్వతమల్లికార్జునా॥ 53

ఉ॥ మత్కథవింటివీవుమదిమాయనుతొల్గగజేయుమయ్యనీ
సత్కథవిందునెప్డునిట సాక్షివి నీవె దయాస్వరూప మా
మత్కుణమానవాధములమర్మముభగ్నముసేయుమయ్య వో
యుత్కలుదారవాసనలుదూపమువేతును మల్లికార్జునా॥ 54

మత్కుణము=సం.వి.అ.పుం.1.నల్లి.2.కొమ్ములులేనియేనుగు.
3.నారికేళము.డు.గడ్డము.మీసములేనిమగవాడు
ఉత్కలు ఁడు=సం.విణ్.(అ.ఆ.అ.)ధురీణుడు,నిర్వాహకుడు.
వాసన=సం.వి.ఆ.స్త్రీ.1.గంధము.2.అనుభూతార్థస్మృతి.3.ప్రత్యాశ.
అ.న.ము.1.వాసనకట్టుట.2.వస్త్రము.3.వీరాసనము.విణ.వససంబంధమైనది

ఉ॥ హస్తిముఖంబుదెచ్చితల హస్తిముఖాసురకోర్కెదీర నా
హస్తిముఖమ్ముపూజగొనయంటితె పుత్రుడజీవిజేయగా
హస్తిదితోలుదీసియదిహ-యిగ వస్త్రమువోలె చుట్టితో
స్వస్తిని కల్ల జేసితివి సర్వ వివేచన  మల్లికార్జునా  ॥ 55

ఉ॥ శంకలవేవిలేకపురశాసనశీర్షమువంచియుంచి యే
వంకనుచూడకుండపరవాంచితమేమియురాకయున్ననా
టంకముకల్లకుండుమది! టక్కరి మానసమెందునిల్వదే?
శంకితబుద్ధిమాన్పుచిక శాంతమతియ్యవె మల్లికార్జునా॥ 56

ఉ॥ కంతవసంతులాటలవికామవికారముకల్లజేయుయే
ప్రాంతమునైనగానియలభావజుబాణపుదెబ్బకాగలే
రెంతటిమౌనులైనసరె రిక్తులగెంతయొబుద్ధిహీనులౌ
శాంతినికల్లజేసిమముశక్తులజేయుము మల్లికార్జునా॥ 57

ఉ॥ రాక్షసులైనగానిమునిరాణ్ముఖులైననుభక్తితోడవో
లక్షితబద్ధులైనినువిలక్షణపద్ధతిగొల్వమెచ్చి వో
యక్షరశక్తినిత్తెపుడుయడ్గినలేదనకుండనిండుగా
ఉక్షమునెక్కితిర్గుచలభోగములిత్తువు మల్లికార్జునా॥ 58

ఉ॥ యక్షులరాజుపూర్వమునయర్చనచేయుటచేతనిచ్చితీ
యక్షులనాయకత్వమల యక్షయశక్తినియిమ్ముదేవరా!
రక్షణమంచిశిక్షణనురమ్యకథాసుధచిత్రజాలమున్
భిక్షగనిమ్ముజీవితముభీతిలకుండగ మల్లికార్జునా॥ 59

ఉ॥ చంచలమానసాత్ములకుచక్కనివిద్యలుయేలవచ్చునే
చంచల బుద్ధి కాకనిక చక్కగ చిత్తము నిల్పశక్తి నీ!

యెంచగనంచెలంచెలుగహెచ్చగునిశ్చలబుద్ధినీయుమా
యించుకకానవయ్యననుసిద్ధునిచేయగ మల్లికార్జునా॥ 60

ఉ॥ మందముమాదుబుద్ధ్యదియమానుషభావముకల్గనెట్లుయా
నందముపొందుటెట్లుపదనర్తనకాంచగమార్గమెట్లునీ
డెందమునందుపాదుకొనుటెట్లగుమోక్షముపొందుటెట్లువో
సుందరదేహనామదిలోశోకముతీర్చుము మల్లికార్జునా॥ 61

ఉ॥ యత్నముచేసిజూచితినియాత్రలుజేసితితీర్థమాడ్తినా
పత్నినివెంటపెట్టుకొనిబాగుగతిర్గిపరీక్షచేసిజూచితిన్
యత్నములెన్నిజేసిననియంత్రితమానసికాకపోతినీ
పత్నితొకల్సిదర్శనసుభాగ్యమునియ్యవె మల్లికార్జునా॥ 62

ఉ॥ స్కందునిజన్మమున్సురలుసంతునుపొందరుపొమ్మనంటిరా
నందముపొందువేళనట నమృత పానులు విఘ్నకారులై
నిందను పొందినారు కద నిర్జరులైనను నిమ్నులైనకా
నందరి శిక్షసేతు నరనారిశరీరుడ మల్లికార్జునా॥ 63

ఉ॥ రాజులు భోగభాగ్యులరు రమ్యసుధాములు రత్నగర్భులున్
యాజులు యోగరాజులు నియంతలు నాదయోగులు
న్వ్యాజులుపాచకాగ్రులును వాక్పతు లుల్కనగర్వితాత్ములై
రాజిలు నేల నిన్విడిచి? రక్షణనీయవె మల్లికార్జునా ॥ 64

ఉ॥ యష్టవునిన్నువిడ్చితనుయాగముచేయగతల్చెదక్షుడా
యిష్టినినిర్వహించగనునిర్జరమూకలువిష్ణువెళ్ళెని
కృష్టపుయాగమందుసతికిష్టములేకదహించెదేహమా
రిష్టిన దక్షఖండనకు రిష్టిని యిచ్చితె మల్లికార్జునా॥ 65

యష్ట= యజ్ఞకర్త: యిష్టి=ఇష్టి= 1.యజ్ఞము.2. కత్తి.3కోరిక.4.సంగ్రహశ్లోకము..
రిష్టము= సం.వి.అ.న.1.క్షేమము.2.అశుభము.3.అభావము. పుం1.ఖడ్గము.2.ఫేనిలము
రిష్టి=సం.వి.ఇ.స్త్రీ.అశుభము.పుం.ఖడ్గము.

ఉ॥ చంద్రకళాధరా!శ్వశురుశాపముపొందినచంద్రరక్షణని
స్తంద్రతజేసిరేఖొకటిదాల్చితెజీవముకల్గజేయగన్
యింద్రియనిగ్రహమ్మునుపరేంగితబుద్ధియుదానమిచ్చితే
యింద్రసురాసురేంద్రులకువిజ్ఞతకల్గగ మల్లికార్జునా॥ 66

ఉ॥ నర్తనవేళనిన్నుకననాదగుచిత్తముకోరునెప్డుయీ
వార్తనునీకుచేర్చగవాంఛతొనుంటినికానిమార్గమే
వర్తనచేతకల్గు ననివారణకాంక్షలు వామదేవయా
కర్తవునీవెదర్శనసుకామ్యముతీర్చవె మల్లికార్జునా॥ 67

ఉ॥ మత్తుడనయ్యినిన్కనెడిమార్గముకానకపోతినేను యు
న్మత్తులమాటవిన్చునిటమత్సరినైతినిదిద్దవైతివే
కుత్తుకబంటిమున్గితినికూర్మినచేరగదీసివిద్యతో
సత్తువనియ్యిశాంతులవశాపములన్నియు మల్లికార్జునా ॥ 68

ఉ॥ హర్తవునయ్యియీసకలహంతకచర్యలచూచుచుంటి సం
హర్తవుకమ్మదుర్మతులయణ్చగశిష్టులరక్షణీయగన్
కర్తవునీవెవిశ్వమునకార్యములన్నిటికెంచి చూడగ
న్నార్తినిబాపఁగన్పడుము నాస్తికమర్ధన మల్లికార్జునా॥ 69

ఉ॥ శిక్షలుచాలునయ్యననుచిక్కులదారినపోవనీకవో
భిక్షగయిమ్మువిజ్ఞతను పేరిమితోడుత భక్తిభావము
న్రక్షగనిమ్ము నాహృదిననాట్యవిలాసముకాంచనిమ్ము రు
ద్రాక్ష సరప్రియా!సగుణదాయక పర్వత మల్లికార్జునా॥ 70

ఉ॥ వారమువారమున్పలువాక్కులుపల్కగనేలనయ్యనా
భారమునీదికాద?మదిపారముముట్టగశక్తినిమ్మయా
కారముచూడనిమ్మపలుకార్యములందునలాభమిమ్మయో
సారసనేత్రపూజితసుశాంతినినిల్పుము మల్లికార్జునా॥ 71

ఉ॥ యజ్ఞములెన్నియున్నవవియన్నియుచేసినపుణ్యులంతనీ
యాజ్ఞకులోబడుండవలెయర్హతనొందగవేచియుండవ
ల్యజ్ఞతతొల్గకున్న నికలక్ష్యము నీపదసేవ చేతనే
విజ్ఞతకల్గవలందురలవీరసుభక్తులు మల్లికార్జునా॥ 72

ఉ॥ చర్మముదాల్చితీవుగజ జాతివిరాజసుభక్తరాక్షసే
శ్వర్మదికోర్కెదీర్చితివి శాసనమిస్తివిహస్తిమస్తకు
న్నిర్మలమానసేశ్వరు నీతివిశేషు గణేశుగానికన్
శర్మసుకర్మభర్మముచక్కగనీయగ మల్లికార్జునా॥ 73

ఉ॥ శిష్టవశిష్టగౌతములశిష్యతతంతశిలాదులాదులు
న్నిష్టతొమౌనులైతపమునిత్యముజేసినగానికానలే
రష్టవిలాసరూపధరరమ్యకపర్థిపరేంగితజ్ఞనీ
యిష్టములేకయున్నకనరిష్టమునెవ్వరు మల్లికార్జునా॥ 74

ఉ॥ వంకరబుద్ధిమానసికివర్ణనలెన్నియుతెల్పిచూచినన్
శంకలుతోలలేడు సరిసారముకానగలేడుమూర్ఖతన్
మంకునువీడలేడుమరిమర్మముతెల్యగలేడుసర్వదా
యంకితభావమున్ననదినజ్ఞతతోలును మల్లికార్జునా॥ 75

ఉ॥ తంతులవెన్నియుండిననుతాతలనుండియుభక్తిభావమే
మంతరమయ్యెభక్తులకుమంగళదాయకమంజుభాషణా

భ్రాంతినివీడ నిన్నుకనభాగ్యముకల్గును నిర్గుణేశ్వరా
క్రాంతిసుశాంతికాంతిశతకాంతులునీవెగ మల్లికార్జునా॥ 76

ఉ॥ రాగవిరాగ భోగకులరాట్టులుశక్తులశక్తియుక్తులున్
యోగులురాజరాజులునుయోధులసాధ్యులుసాధనేంద్రులున్
బాగుగనెంచిచూడగను భాగ్యవిదాతగు నీదుముందటన్
సాగునెవారియాటలవసక్రమమైనచౌమల్లికార్జునా ॥ 77

ఉ॥ యక్షిణివిద్యలేవియునుయక్షయశక్తులుగావుతండ్రినీ
రక్షణ యున్ననన్నియును రమ్యతలేయగు రాజశేఖరా
సాక్షివి నీవె సర్వఫల శాసనకర్తవు శాస్త్రదాతవు నీ
రక్షణలేకసర్వము నరమ్యతయేయగు మల్లికార్జునా॥ 78

ఉ॥ చక్రమునిచ్చినావుకద శౌరికి కన్నుపరీక్షగైకొని
న్నృక్రసురాదులందరకు శాంతినినిచ్చులుకల్గజేయ నీ
విక్రమవీక్షణందునను వీడెనుదేహముమారుడంతనో
సక్రమబుద్ధిహీనుడయి సల్పినమాటకు మల్లికార్జునా॥ 79

తత్పురుషాయవిద్మహే--మహ-దేవాయ ధీమహి--తన్నోరుద్రప్రచోదయాత్
ఉ॥ తత్వమునెర్గనేను పరతత్వమనంగనుయెర్గుటెట్లు నీ
తత్వముచెప్పలేదసలు! తాత్వికచింతనయన్ననేమిటో?
సత్వరమేను యత్నమది సల్పితి నిర్మలుడేడి?కాననో
తత్వవిచారధీరమరితత్వముతెల్పవె మల్లికార్జునా॥ 80

ఉ॥ తప్పులనెంచకయ్య నితాంత నికాయ నిత్యసత్య నే
తప్పులుతెల్సిచేయనయతంతులుతెల్యవునందివాహనా
మెప్పులకోసమేమధిగమించనుచక్కగవిందుచెప్పిన

న్నిప్పుడునీదుయాజ్ఞలనునిక్కముచూడుముమల్లికార్జునా॥ 81

ఉ॥ పుణ్యముపుణ్యమందురలపుణ్యమనంగనుతెల్యుటెట్లయా?
పుణ్యమనంగనేతెలిసెపూర్వులుతెల్పినమంచిపన్లలో
నాణ్యతచూపవల్యనిరి నాదగుమార్గమునెంచిచూడగన్
పుణ్యమనంటె హింసయదిపూర్తిగమానుటె మల్లికార్జునా ॥ 82

ఉ॥ రుద్రముచద్వవన్సకలరోగములీనమగంటిరయ్యనే
రుద్రమునెన్నిమారులిటరుబ్బితినోకననేది?కాననే
భద్రతనిచ్చటెప్పుడును!భావముతెల్పితినాహృదందునా
రుద్రముభక్తితోచదువరోగముపోవని మల్లికార్జునా॥ 83

ఉ॥ షాడబపానమత్తులగుషండులుకానగలేరునిన్నునో
బేడిదమానిసెప్పుడునుభిక్షగపొందగలేడువిద్యలన్
పాడిగశైవదంపతులపావనగర్భమునపుట్టినన్సరో
గాడిదగంధవస్తువులకట్టలుమోయదె? మల్లికార్జునా॥ 84

ఉ॥ విస్తరజేతువెంతయునువిస్మయమొందగమూడులోకము
ల్డుస్తరమయ్యకోపమది దుఃఖనివారణదుష్టమర్దనా
చస్తిరినీదుకోపమునసక్రమబుద్ధ్యదిలేనిరాక్షసుల్
వస్తిమినిన్నుచూడనగువాంఛతొకానవె మల్లికార్జునా॥ 85

ఉ॥ దగ్ధముచేసినావటలదానవపట్టణమొక్కబాణమున్
ముగ్ధమనోహరమ్మగునమోఘుమహ-ధనువందినాడు వో
స్నిగ్ధమనోహరాంగిరిజ౯ నీహృదినిల్పితివంటదిట్టవై
దుగ్ధమునీకుయిష్టమనితోడుతతెచ్చితి మల్లికార్జునా॥ 86

ఉ॥ మజ్జనమేమిలేదుకనమారుటిబట్టలులేవుచూడగన్
సజ్జనసంతులేదసలుసాధనకానగరాదుకాంచనీ
పజ్జనయుండనిస్తువటపామరులందరినెంతొకూర్మితో
యుజ్జనసేయవీవలనొక్కరికూడను మల్లికార్జునా॥ 87

ఉ॥ హేమముయెక్కడున్నదనివెత్కుచునుందురునిన్నుకాంచకన్
హైమవతీశ!నీమదియెప్పుడు తప్పక యున్నచిక్కదా
కామముకట్టికార్యమునుకారణమంతయుతర్చిచూడగా
హేమమునీవెభక్తి(గనహేమనిధీవయె మల్లికార్జునా॥ 88

ఉ॥ మంతనమేమిలేదుమరిమాయలుయేమియులేవుమత్తులై
చింతనజేయలేడునిమదిచిన్మయరూపముకాంచలేడునా
యంతటివారులేరనెడహమ్మునువీడగలేడుకాముకై
శాంతినిపొందలేడిలనసక్రమమానిసి మల్లికార్జునా॥ 89

ఉ॥ హ-సవిలాసవేషరసహ-యవికాసవిధాయకమ్మునీ
బాసలు! భావజారి పలుపాపపుటాశలబంధమందుచి
క్కీ్వసమునెత్తుతల్వరుగయీజనమాన్యులుయట్టివారికి
న్వాసమునిత్తువేల?యఘనాశనయద్భుత మల్లికార్జునా॥ 90

ఉ॥ దేవతలైనగానిభువిదేవతలైననుగానితల్వగ
న్వావకుడైనగానిదివినాయకుడైననుగానిధీనిధా
దేవగురుండుగానినియతేంద్రియశక్తులుగానిసద్విధిన్
భావనజేయ కాంతు(నిను పావకలోచన మల్లికార్జునా॥ 91

ఉ॥ వాస్తవమేమనన్ధరణివాక్కులుకల్గినవారుమానవు

ల్వాస్తవచూపులేకనతిలాలసులైనినుతల్చరెప్పుడున్
చూస్తిమిమాటరానిదగుసూకరినీగుడిచుట్టుతిర్గదే
విస్తరమైనదీమనిషివిజ్ఞతనంతయు మల్లికార్జునా॥ 92

ఉ॥ యంత్రనియంత్రితమ్మువుచయాతనలెన్నియొపొందుచుండెనీ
యాంత్రికమానసుండు పలుయంత్రములెన్నియొచేసివాటికై
యంత్రితమానసైబ్రతుకుహ-యిగయున్నదనెంచుచుండునా
యాంత్రికబుద్ధికేవిధినయాతనతప్పును మల్లికార్జునా॥ 93

ఉ॥ ధీరులుయైనవారుగణుతించరుకష్టమునీదుసేవకున్
భారముయెంతయైనసరెబాధలుపొందినగానిమానరా
పారముముట్టుదాకసదుపాయనమిచ్చెడి దాకనోర్మితో
తారకుడీవనెంచుటచెధన్యతనొందగ మల్లికార్జునా॥ 94

ఉ॥ మంత్రములేమిరావుమరిమాయముసేయరాదునే
తంత్రమనంగనేమెరుగతాతలునేర్పనులేదునేర్వలే
జంత్రకుడీవునీతలడెు జర్గు పరీక్షలుయేలనయ్యాయా
యాంత్రికజీవనమ్ముపరిహ-సపుపాలవు మల్లికార్జునా॥ 95
జంత్రకాడు=సూత్రధారి అతని ఆజ్ఞమేఱకె నటులు నటించెదరు
ఉ॥ హింసనువీడసాత్వికుడగెంతయొసాధనయందుసిద్ధుడౌ
పాంసువునంటదేమియునుభావనచక్కగయుండువిజ్ఞుడౌ
శంసనకర్తుడౌసకలశాస్త్రములొచ్చును శంకహీనుడౌ
హింసయెపాపపంకిలముయిష్టినిచెర్చును మల్లికార్జునా॥ 96

ఉ॥ తప్తముగానిమానసముతప్పునుమార్గముతన్వినొందదే
గుప్తమునైనవిద్యయిదిగుర్వులసేవలవల్లవచ్చుయే
తృప్తదిలేనివాడుగురుతింపునుపొందడుగుర్వుకాడుయా

తృప్తియెనీదుదర్శనమదిచ్చునునిచ్చలు మల్లికార్జునా॥ 97

ఉ॥ నశ్వరమౌధనమ్మునిటనార్తినపొందగనేలనయ్యయీ
విశ్వపతీవునీపదమువిడ్వనువిజ్ఞతనిమ్ముమవిశ్వనాయకా
శాశ్వతసంపదీవనుచుశాసనమాయెనుశాంతిదాయకా
విశ్వసనీయభక్తుడనువీడకుననన్నిక మల్లికార్జునా॥ 98

ఉ॥ నశ్వరదేహమున్నిలచినాదిదినేనిదియన్చుఢుల్కితి
న్నశ్వమువోలెనాగకెటనాశనువీడకతిర్గితిర్గివో
శాశ్వతమైనదేదనివిచారణచేసితినష్టతెల్పనీ
విశ్వమునీవెశాశ్వతుడవీవనిచక్కగ మల్లికార్జునా॥ 99

ఉ॥ ఓగివియోగిభోగివినియోగివిరాగిసుయోగయోగియున్
రాగివిరాగిరోగిఘనరాగినిరోగిసువాగ్మిమూగియున్
త్యాగికుయోగివేగినిరతాగమశాస్త్రవిచారులాదులా
యాగముచేయువారలికయందరుభక్తులెమల్లికార్జునా॥ 100

ఉ॥ రువ్వకుబాణమేదియునురోసముతోడుతభక్తసంతుపై
గవ్వకుకానివారనువికారపుమాటలువింటె వారిపై
రువ్వమునీదుబాణమునురోసకసాయపుచూపుతోడుతన్
నవ్వునుమాకుపంచుమయనాస్తికమర్దన మల్లికార్జునా॥ 101

ఉ॥ ద్రవ్యము లన్నినీకళలె దాహకుడీవయెదాతవీవయే
సవ్యమసవ్యమంతటికి సాక్షివి శాసనకర్తవీవయే
కావ్యుడవీవెగీష్పతివికార్యముకారణమంతనీవయే
సేవ్యుడవీవుసేవకుడసేమముసేయవె మల్లికార్జునా 102

ఉ॥ ప్రస్తుతవిద్యలన్నియునువిజ్ఞతనీయసమర్ధమేలనౌ
వస్తువులందెచూపులవి వర్తిలుచుండునునాస్తికత్వతన్
వస్తునిగూఢతత్వమగు వర్తనకార్యముకాంచలేరులే
చూస్తువుయేల నీయు మికసూక్ష్మపువిద్యను మల్లికార్జునా॥ 103

ఉ॥ చోదకుడీవుచోద్యములచూచెదవేలయచెల్లజేయవా
వేదమువిందమన్ననిటవిన్పడదేమియునుసాదసాధనే
కాదయయొక్కసారికని కాంక్షదితీర్చుమువేదసాధనే
సాదముగాగ లోకమునశాసనమీయుము మల్లికార్జునా॥ 104

ఉ॥ దక్షునిగర్వమణ్చగనుదక్షసుతాగ్నికిదాహమయ్యెనా
యుక్షముచెప్పకోపమునయుత్కటజూటమునిప్పివో
లక్షముతోడకొట్టెశినంతట భద్రుడుపుట్టిదక్షునిన్
శిక్షితుచేసె దక్షుడవు చిద్ఘనచిన్మయ మల్లికార్జునా॥ 105

ఉ॥ యాచనచేయనయ్యనయక్కునచేర్చుకొనయ్యనీకునే
వాచఅచుంటినయ్యయవాచకమేమియులేదునీదయా
వాచక మేను కోరెదను వాక్పతివీవని తల్తునయ్య నీ
యోచనయందునుండగనుయోగమునియ్యవెమల్లికార్జునా॥ 106

ఉ॥ తక్కువసేతువాసుతునిధార్మికవిద్యలనీయుమయ్యనీ
ప్రక్కనయుండనిమ్ముపరపాకమువద్దనియుంటినమ్మమా
చిక్కక పోతి నెవ్వరికి చిక్కితి నీకిక నీదుజాలమున్
చుక్కలరేనితాల్పువగుసుందరరూపమ మల్లికార్జునా॥ 107

ఉ॥ శ్రీగిరిలింగసంగతినచిన్మయచింతనజేసినాడనో
యోగవిశేషభోగఫణియుక్తవిహ-రవికాసనారధీ

నాగవిభూషనాట్యనటనాయుతనాయకనాట్యమానసా
రోగవినాశవిశ్వనుతరోచితలోచనమల్లికార్జునా ॥ 108

మదీయహృదాయాకాశవిరాజమానవిశేషవిజ్ఞానవిధాయక
మల్లికార్జునలీలావిలాసమీ కృతి ఇతిశం
20-09-2010సోమవారమురాత్రి గం.11.50ని.లకుపూర్తి అయినది

ములుగు విశ్వనాథారాధ్య

కౌండిన్యసగోత్రోద్భవుండగు ములుగునాగలింగారాధ్య ప్రపౌత్రుండును విశ్వనాధారాధ్య పౌత్రుండును దుర్గాప్రసాదారాధ్యపుత్రుండును
హనుమకొండ వాస్తవ్యుండును యగు ములుగు విశ్వనాథారాధ్య విరచితమల్లికార్జునా నామ మకుట స హిత అష్టోత్తరశత పద్య
సుమంబులు.